వ. ఒక్కకరంబు మలంచి కౌఁగిలించుకొని యచ్చట నున్నరక్షకాదిజనంబుల నవులం బోవం బనిచి యతనితో ని ట్లనియె. 442

**ప్రతిపదార్థం:** ఒక్క కరంబు= ఒకచేతిని; మలంచి= తిప్పి; కౌఁగిలించుకొని= ఆలింగనం చేసికొని; అచ్చటన్= ఆ భీష్ముడివద్ద; ఉన్న= ఉన్నట్టి; రక్షక+ఆది జనంబులన్= కాపలాగా ఉండే వారిని; అవులన్+పోవన్+పనిచి= అవతలకు వెళ్ళమని ఆజ్ఞచేసి; అతనితోన్= ఆ కర్ణుడితో; ఇట్లు+అనియె(న్)= ఇలా అన్నాడు.

**తాత్పర్యం:** ఒక చేతిని అడ్డంగా తిప్పి కర్ణుడిని కౌగిట చేర్చికొని, అక్కడ ఉన్న రక్షకాది పరివారాన్నంతా అవతలకు దూరంగా వెళ్ళండని చెప్పి, కర్ణుడితో భీష్ముడిలా అన్నాడు.

క. ' నీ దెసఁ గోపింతునె? కుల । భేదముగాఁ బలుకుటయును బిడ్డలఁ జెఱుపం
గా దని కినియుదు లే దన । రా దదలుతు నిన్ను నిష్ఠురంపుఁ బలుకులన్. 443

**ప్రతిపదార్థం:** నీ దెసన్= నీపట్ల; కోపింతును+ఎ?= కోపపడతానా?; కులభేదముగాన్= కులం పేరిట వ్యత్యాసంతో; పలుకుటయును= పలకటంచేతను; బిడ్డలన్= కౌరవసంతానాన్ని; చెఱుపన్+కాదు+అని= చెరచటం మంచిదికాదని; కినియుదున్= కోపపడతాను; నిష్ఠురంపు+పలుకులన్= కటువైన మాటలతో; నిన్ను= కర్ణుడవైన నిన్ను; అదలుతున్= గద్దిస్తాను; లేదు అనరాదు= అది వాస్తవమే.

**తాత్పర్యం:** 'కర్ణా! నీ మీద నాకేమి కోపం? పాండవులపట్ల కౌరవులకు భేదబుద్ధి కలిగించే మాటలు మాట్లాడుతావని, కురుసంతానాన్ని చెరచటం తగదని నిన్ను కఠినమైన మాటలతో అదలించిన మాట నిజం. అంతేకాని, నాకు నీ మీద నిజంగా కోపం లేదు.

వ. అది శిక్షగాని రోషంబు గా దట్లుం గాక. 444

**ప్రతిపదార్థం:** అది= ఆ కోపించడం, విసిగించడం; శిక్షగాని= బోధించటమేగాని; రోషంబు= కోపం; కాదు= కాజాలదు; అట్లున్+కాక= అదీకాకుండా.

**తాత్పర్యం:** ఆ విధంగా నేను కోపపడినది, నిన్ను విసిగించినది, నీకు మంచిని నేర్పించటానికే గాని నీపైన నాకు కోపంలేదు. అదీగాక. (తరువాతి పద్యంతో అన్వయం.)

క. నీ యుదయము దైవిక గ । ర్భాయత్తము నీకు మర్త్యు లసదృక్షులు గౌం
తేయుఁడవు గాని విను రా । ధేయుండవు గావు నీవు ధీరవిచారా! 445

**ప్రతిపదార్థం:** ధీరవిచారా!= స్వతంత్రంగా ప్రమాణ రీతితో విషయాన్ని పరిశీలించగల కర్ణా!; నీ+ఉదయము= నీయొక్క పుట్టుక; దైవిక+గర్భ+ఆయత్తము= దేవసంబంధమైన గర్భానికి అధీనమైనది; నీకున్; మర్త్యులు= మానవులు; అసదృక్షులు= సాటివారుకారు; విను; నీవు; కౌంతేయుఁడవుగాని= కుంతికొడుకువేగాని; రాధేయుండవుకావు= రాధ కొడుకువుకావు.

**తాత్పర్యం:** మంచి చెడ్డలు స్వయంగా ఆలోచించగల కర్ణా!, నీ పుట్టుక దేవ సంబంధంతో ఏర్పడిన గర్భం వల్ల కలిగినట్టిది కాబట్టి, మానవులెవ్వరూ నీకు సమానులు కారు. నా మాట బాగా ఆలకించు. నీవు కుంతి కొడుకువేగాని రాధ కొడుకువు కానేకావు.





వ. ఇది కృష్ణద్వైపాయనుండు నాకు నేకాంతంబున నెఱింగించె. నేనును భవదీయతేజోవిశేషంబువలనను గనుంగొనియుండుదుఁ బాండుతనయుండ వగుటంజేసి నీ యెడ వాత్సల్యంబు కాని మాత్సర్యంబు లే దింక నొక్కటి సెప్పెద విను మేను గురుపాండవులవైరం బుడిపిపుచ్చితి నప్పాండవేయు లజయ్యు లప్రమేయుండగు కృష్ణుండు వారికి విధేయుండు గావున వారలతోడి విరోధం బొప్పదు నీవును నొండుదలంపు దక్కి య క్కౌంతేయులం గలిసి యుండు మనినఁ గర్ణుం డతని కి ట్లనియె. 446

**ప్రతిపదార్థం:** ఇది= ఈ విషయం; కృష్ణద్వైపాయనుండు= వేదవ్యాస మహర్షి; నాకున్= (భీష్ముడనైన) నాకు; ఏకాంతంబునన్= ఒంటరిగా వుండేటప్పుడు; ఎఱింగించెన్= తెలియచెప్పాడు; ఏనును= నేనుకూడా; భవదీయ తేజః+విశేషంబు వలననున్= నీదైన తేజస్సుయొక్క అతిశయంవల్లకూడా; కనుంగొని; ఉండుదున్= తెలిసికొని ఉన్నాను; పాండుతనయుండవు= పాండురాజు కుమారుడివి; అగుటన్+చేసి= కావటంవల్ల; నీ+ఎడన్= నీమీద; వాత్సల్యంబు+అ+కాని= పుత్రప్రేమయేగాని; మాత్సర్యంబులేదు= ద్వేషములేదు; ఇంకన్+ఒక్కటి+చెప్పెదన్= మరొకమాట చెప్తాను; వినుము; ఏను= భీష్ముడనగు నేను; కురుపాండవుల వైరంబున్= కౌరవులకు పాండవులకు గల విరోధాన్ని; ఉడిపి పుచ్చితిన్= తగ్గింపజేశాను; ఆ+పాండవేయులు= ఆ పాండురాజు సంతతివారు; అజయ్యులు= జయింపశక్యం కానివారు; అప్రమేయుండు+అగు= ఈపాటివాడనటానికి వీలుపడని; కృష్ణుండు; వారికి; విధేయుండు+కావునన్= లోబడ్డవాడు కావడంచేత; వారలతోడి= ఆ పాండవులతో; విరోధంబు= వైరము; ఒప్పదు= తగదు; నీవునున్= నీవు(కర్ణుడవు)కూడా; ఒండు+తలంపు+తక్కి= వేరే ఆలోచన మాని; ఆ+కౌంతేయులన్= ఆ కుంతి కొడుకులను; కలిసి యుండుము= చేరుకొని ఉండుము; అనినన్= అని చెప్పగా; కర్ణుండు; అతనికిన్= ఆ భీష్ముడికి; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తాత్పర్యం:** కర్ణా! నీ పుట్టుకను గూర్చి వేదవ్యాస మహర్షి నాకు రహస్యంగా చెప్పాడు. నేనుకూడా నీ దివ్యతేజస్సును చూచి, దేవాంశ వలన పుట్టావని తెలిసికొన్నాను. పాండురాజు కొడుకువు కాబట్టి, నీమీద నాకు పుత్రవాత్సల్యమే ఉన్నదిగానీ ద్వేషం కొంచెం కూడా లేదు. నే నొకమాట చెపుతాను బాగా వినుము. నేను కురు పాండవుల వైరాన్ని అంతమయ్యేటట్లు చేశాను. ఆ పాండవేయులా జయింపశక్యం కానివారు. పైపెచ్చు ఈపాటి వాడనడానికి వీలుకాని కృష్ణుడే వారికి విధేయుడై ఉన్నాడు. కనుక వారితో విరోధం మానుకొమ్ము. నీవు వేరే ఆలోచన పెట్టుకొనకుండా పాండవులతో కలిసి మెలిసి ఉండుము' అన్నాడు. కర్ణుడు భీష్ముడితో ఇట్లా అంటున్నాడు.

క. ' కౌంతేయుండ నగుదు నిది । యంతయుఁ దొల్లియును వింటి నార్యులచే ని
ట్లింతయు నెఱిఁగినఁ గుంతీ । సంతానముతోడి పొత్తు సనునే? నాకున్. 447

**ప్రతిపదార్థం:** కౌంతేయుండన్= కుంతికొడుకు; అగుదున్= ఔతాను; ఇది అంతయున్= ఈ విషయమంతా; తొల్లియును= ముందుకూడా; ఆర్యులచేన్= పెద్దలవల్ల; వింటిన్= విన్నాను; ఇట్లు+ఇంతయున్= ఈ విధంగా నా పుట్టుకనంతా కూడా; ఎఱిఁగినన్= తెలిసినప్పటికినీ; కుంతీసంతానముతోడి పొత్తు= పాండవులతో స్నేహం; నాకున్; చనును+ఏ?= తగునా? (తగదు).

**తాత్పర్యం:** ' నేను కుంతికొడుకునే. ఆ సంగతి ముందే పెద్దలు చెప్పగా విన్నాను. ఈ సంగతి అంతా బాగా తెలిసి యుండగా పాండవులతో నాకు స్నేహం ఎట్లా పొసగుతుంది? బొత్తిగా పొత్తు పొసగదు.

ఉ. వారు మహాబలుల్ హరియు వారికిఁ బ్రాపు గలండు వారలం
బోర జయింపరామియును బుద్ధి నెఱుంగుదు నైనఁ గౌరవ
క్ష్మారమణుండు సేయుతగుమన్నన లెల్లఁ దలంచి చూచినన్
భూరివివేక! యే విడిచిపోవుట ధర్మమె? వీరకర్మమే? 448

**ప్రతిపదార్థం:** భూరి వివేక!= అధికమైన జ్ఞానం కల భీష్మా!; వారు= ఆ పాండవులు, మహాబలుల్= గొప్పబలంగలవారు; హరియు(న్)= కృష్ణుడున్నూ; వారికిన్= ఆ పాండవులకు; ప్రాపు= అండగా; కలండు= ఉన్నాడు; వారలన్= ఆ పాండవులను; పోరన్= యుద్ధంలో; జయింపరామియును= జయించలేక పోవటం; బుద్ధిన్= మనస్సులో; ఎఱుంగుదున్; ఐనన్= అట్లయినప్పటికీ; కౌరవక్ష్మారమణుండు= కురురాజు దుర్యోధనుడు; చేయు= చేస్తున్న; తగు మన్ననలు= ఉచితమైన సత్కారాలు; ఎల్లన్= అన్నిటిని; తలంచి= ఆలోచించి; చూచినన్= చూడగా; ఏన్= నేను(కర్ణుడు); విడిచిపోవుట= కౌరవుల్ని వదలివేసి వెళ్ళటం; ధర్మము+ఎ?= న్యాయమా?; వీరకర్మము+ఏ?= వీరులు చేసే పనేనా?

**తాత్పర్యం:** ఆ పాండవులు మంచిబలం గలవారు. అదీగాక, కృష్ణుడు వారికి అండగా ఉన్నాడు. అట్లాంటివారిని యుద్ధంలో జయించలేమనే విషయం కూడా నాకు బాగా తెలియును. అయినా దుర్యోధనుడు నాకు చేసే సమ్మానాలు, గౌరవాలు ఎన్నో! వాటిని అంతా తలచుకొని ఆలోచిస్తే, కౌరవులను వదలిపెట్టి, పాండవుల పక్షంలో చేరటం ఏం న్యాయం? అది వీరులకు ఉచితమైన పని కానే కాదు.

**వ. అదియునుం గాక. 449**

**ప్రతిపదార్థం:** అదియునున్+కాక= అంతమాత్రమే కాకుండా,

**తాత్పర్యం:** అంతేకాకుండా. (తరువాతి పద్యంతో అన్వయం.)

**ఉ. మాటలు పెక్కు లాడి యనుమానము లేక సభం గడంగి ప**
**ల్మాటుఁ బరాభవించితిఁ జలంబునఁ బాండవకోటి కెప్పడుం**
**జేటు దలంచి యే బలువు సేసితి వైరము నాకు నింక నీ**
**వీటికి వారివీటికిని వెక్కస మయ్యెడు కయ్య మొప్పగున్. 450**

**ప్రతిపదార్థం:** సభన్= కొలువుకూటంలో; కడంగి= ప్రయత్నపడి; అనుమానములేక= సందేహంలేకుండా; పెక్కులు మాటలు= నానా మాటలు; ఆడి= పలికి; పలు+మాటున్= చాలా తడవులు; పరాభవించితిన్= అవమానపరచాను; ఏన్= నేను; చలంబునన్= మాత్సర్యంతో; పాండవకోటికిన్= పాండవుల బృందానికి; ఎప్పుడున్= ఎల్లప్పుడు; చేటు= వారి నాశనాన్నే; తలంచి= కోరి; వైరము= విరోధాన్ని; బలువుచేసితిన్= బలపడేటట్టు చేశాను; నాకున్= అటువంటి నాకు; ఇంకన్; ఈ వీటికిన్= ఈ కౌరవసైన్యానికి; వారి వీటికినిన్= ఆ పాండవుల సైన్యానికిన్నీ; వెక్కసము+అయ్యెడు= దుస్సహమైన; కయ్యము= యుద్ధం; ఒప్పు+అగున్= సమ్మతమైనదౌతున్నది.

**తాత్పర్యం:** నేను కొలువుకూటంలో కావాలని ఎన్నోసార్లు జంకూగొంకూ లేకుండా దుర్భాషలాడి వారిని అవమానపరచాను. వారిమేలు(గొప్ప) చూచి ఓర్చుకోలేక వారు చెడిపోవాలని విరోధాన్ని బాగా పెంచాను. ఈ కౌరవసేనకు, ఆ పాండవసేనకు, దుస్సహమైన యుద్ధమే తగింది.

**శా. దైవాధీనము సర్వమున్ మనమతిం దప్పింపఁగా వచ్చునే?**
**నీ వింకన్ నను నొండు వల్కక పరానీకంబుపైఁ బంపు మ**
**త్సేవాధర్మము నిర్వహించెద బలోత్సేకంబు లోకంబు సం**
**భావింపన్ విహరించెదన్ మురరిపుం బార్థుం దలంకించెదన్.' 451**

**ప్రతిపదార్థం:** సర్వమున్= అంతా కూడా; దైవ+అధీనము= దైవానికి అధీనమే; మనమతిన్= మనయొక్క కోరికను; తప్పింపఁగాన్= తొలగించడానికి; వచ్చును+ఏ?= సాధ్యమా?; ఇంకన్= ఇకమీద; నీవు= (భీష్ముడవైన) నీవు; ఒండు+పల్కక= వేరేమాటలు





చెప్పకుండా; ననున్; పర+అనీకంబుపైన్= శత్రువుల సేనమీదికి; పంపుము= పంపించుము; మత్+సేవాధర్మము= నా సేవాధర్మాన్ని; నిర్వహించెదన్= నెరవేరుస్తాను; బల+ఉత్సేకంబున్= నా బలాతిశయాన్ని; లోకంబు= జనము; సంభావింపన్= గౌరవించేటట్లుగా; విహరించెదన్= రణరంగంలో విహరిస్తాను; మురరిపున్= కృష్ణుడిని; పార్థున్= అర్జునుడిని; తలంకించెదన్= అదురగొట్టుతాను.

**తాత్పర్యం:** అంతా దైవాధీనం. 'బుద్ధిః కర్మానుసారిణీ' ఒక్కొక్కడి కర్మకు తగినట్టు వాడికి బుద్ధి పుడుతూ ఉంటుంది. దానిని తప్పించడం ఎవరి వల్లా కాదు. నీవిక వేరే మాటలు చెప్పడం చాలించి, శత్రుసైన్యాల మీదికి నన్ను పంపించు. నేను దుర్యోధనుడికి చేయవలసిన సేవారూపమైన ధర్మాన్ని నెరవేర్చికొంటాను. నా బలాధిక్యాన్నిలోక మంతా కీర్తించేటట్లుగా యుద్ధ రంగంలో స్వైరవిహారం చేస్తాను. ఆ కృష్ణుడిని, అర్జునుడిని కల్లోలపెట్టుతాను'.

**చ. అన విని భీష్ముఁ డిట్టులను నంతకుఁ జాలు టెఱుంగనే? సుయో**
**ధనునకు నెప్డు నీదుభుజదర్పమ కాదె? సహాయ మెద్ది యా**
**తనికిఁ బ్రియంబు దానిన యుదాత్తమతిం దగ నాచరింపు నీ**
**మనమున సంతసిల్లు మనుమానము దక్కు మనుజ్ఞ యిచ్చితిన్.' 452**

**ప్రతిపదార్థం:** అనన్= అని చెప్పగా; విని= ఆలకించి; భీష్ముఁడు= భీష్ముడు; ఇట్టులు= ఈ విధంగా; అనున్= అంటున్నాడు; అంతకున్= నీవన్నంత పనికి; చాలుట= తగినవాడవగుట; ఎఱుంగన్+ఏ= ఎరుగనా?(ఎరుగుదును); ఎప్డున్= ఎప్పుడున్నూ; సుయోధనునకున్= దుర్యోధనుడికి; నీదు= నీ యొక్క; భుజదర్పము+అ= బాహుబలమే; సహాయముకాదు+ఎ?= తోడు కాదా?; ఆతనికిన్= ఆ దుర్యోధనుడికి; ఎద్ది ప్రియంబు= ఏది ఇష్టమో; దానిన్+అ= అట్టిదానినే; ఉదాత్తమతిన్= ఉదారమైన బుద్ధితో; తగన్= తగినట్లుగా; ఆచరింపు(ము)= చేయుము; నీ మనమునన్= నీ మనస్సులో; సంతసిల్లుము= సంతోషపడుము; అనుమానమున్= సందేహాన్ని; తక్కుము= వదలుము; అనుజ్ఞ= అనుమతిని; ఇచ్చితిన్= ఇచ్చాను;

**తాత్పర్యం:** కర్ణుడన్న మాటలు విన్న తరువాత భీష్ముడు ఇట్లా అన్నాడు: 'కర్ణా! నీ వన్న మాదిరి అన్నీ చేయటానికి నీవు సమర్థుడవే అని నాకు బాగా తెలియును. నీ భుజబలమే కదా దుర్యోధనుడికి ఎప్పుడూ సహాయం! అతడికి ఏది ఇష్టమో దానినే నీవు చేయుము. నీవు మనస్సులో ఆహ్లాదంగా ఉండుము. సందేహం వదలివేయుము. అనుజ్ఞ ఇచ్చాను. (ఇక ముందుకు సాగుము.)

**విశేషం :** భీష్ముడు కర్ణుడిని అర్ధరథుడన్నాడు. అందుకు అలిగి కర్ణుడు - భీష్ముడు యుద్ధం చేసే రోజులలో, తనుగాని తన పరివారంగాని యుద్ధంలో పాల్గొనమని, భీష్ముడు జయిస్తే తాను అడవిపాలౌతానని, లేక భీష్ముడు ఓడిపోతే, అతడిని జయించినవాడిని తాను జయిస్తానని శపథం చేశాడు. కనుకనే ఇప్పుడు అలుక మాని, వాత్సల్యంతో చూచి, మంచిమాటలు వచించుమని ఆ మహాత్ముడిని కోరాడు. భీష్ముడు కూడా కర్ణుడిని బుజ్జగించి ఎన్నో హితోక్తులు పలికాడు. కాని, దైవనిర్ణయాన్నే కాక, కర్ణుడి నిర్ణయాన్ని కూడా భీష్ముడు మార్చలేకపోయాడు.

**వ. అని తెలి వొంది పలికిన దేవవ్రతుబంధుభావంబునకుం బరమానందంబు నొంది రాధేయుండును నిజ నివాసంబునకుం జనియె'నని సంజయుండు ధృతరాష్ట్రునకుం జెప్పెనని జనమేజయునకు వైశంపాయనుండు సెప్పుటయు. 453**

**ప్రతిపదార్థం:** అని= ఆ ప్రకారంగా; తెలివిఒంది= ప్రజ్ఞ కలిగి; పలికిన= చెప్పినట్టి; దేవవ్రతుబంధుభావంబునకున్= భీష్ముడి చుట్టరికపు వాత్సల్యానికి; పరమ+ఆనందమున్= మిక్కుటమైన సంతోషాన్ని; ఒంది= పొంది; రాధేయుండును= కర్ణుడు; నిజ

నివాసంబునకున్= తన నివాసానికి; చనియెన్+అని= వెళ్ళాడని; సంజయుండు; ధృతరాష్ట్రునకున్; చెప్పెన్+అని= చెప్పాడని; జనమేజయునకున్= పరీక్షిత్తు కుమారుడికి; వైశంపాయనుండు; చెప్పుటయున్= చెప్పగా.

**తాత్పర్యం:** ప్రజ్ఞతో గూడిన భీష్ముడు చెప్పిన మాటలు కర్ణుడు విన్నాడు. ఆయనకు గల బంధుప్రీతికి చాలా సంతోషపడ్డాడు. తన నివాసానికి వెళ్ళాడు' అని సంజయుడు ధృతరాష్ట్రుడికి చెప్పా డని జనమేజయుడికి వైశంపాయనుడు చెప్పగా.

**ఆశ్వాసాంతము**

**ఉ.** **మర్దితతాపసంకలన మంజులనామ! దురంత దుర్దశా**
**కర్దమలేప నిర్హరణకారి కృపామృత పూర! కర్మసం**
**మర్ద నిరాస కర్మఠ! సమత్వ పరిస్ఫుట రూప భావనా**
**నిర్దళితారి వర్గ! మహనీయ! మనోరమణీయవైభవా!** 454

**ప్రతిపదార్థం:** మర్దిత= అణచబడిన; తాప= ఆధ్యాత్మికం, ఆధిదైవికం, ఆధిభౌతికం అనే మూడు రకాల తాపాలయొక్క; సంకలన= సంబంధం కల; మంజులనామ!= మనోహరమైన నామం (పేరు) కలవాడా!; (హరిహరనాథ నామం స్మరిస్తే చాలు తాపత్రయాల సంబంధం నశిస్తుందని భావం); దురంత= దుఃఖాంతమైన లేదా దాటటానికి శక్యం కాని; దుర్దశా= దురవస్థ అనెడి; కర్దమలేప= బురదపూతను; నిర్హారణకారి= పోగొట్టే; కృప+అమృతపూర!= దయ అనే అమృత ప్రవాహరూపం కలవాడా!; కర్మ= సంసార హేతువులైన కర్మలయొక్క; సంమర్ద= సమూహాన్ని; నిరాస= పోగొట్టటమనే; కర్మఠ!= కార్యాన్ని ఆచరించేవాడా!; సమత్వ= సుఖదుఃఖాలవంటి ద్వంద్వాల పట్ల సమభావంచేత; పరిస్ఫుటరూప= స్పష్టంగా తెలియబడేరూపం గల; భావనా= మనోవ్యాపారరూపమైన భావంచేత; నిర్దళిత= పోగొట్టబడిన; అరివర్గ!= కామక్రోధాదులైన అంతశ్శత్రువులు కలవాడా!; (సుఖదుఃఖాలపట్ల సమభావం కలిగిన చిత్తం కలవారి అరిషడ్వర్గాన్ని నశింపచేసేవాడని భావం); మహనీయ!= గొప్పవాడా!; మనోరమణీయ= మనస్సును రంజింపజేసే; వైభవా!= వైభవం కలవాడా! - హరిహరనాథా!

**తాత్పర్యం:** భక్తుల తాపత్రాయలను పోగొట్టే మనోహరమైన నామం కలవాడా! దుఃఖదాయకమైన దురవస్థలనే బురద పూతను పోగొట్టే కృప అనే అమృత ప్రవాహం కలవాడా! బలమైన కర్మల బారినుండి భక్తులను తప్పించే సత్కార్యాలను నిర్వహించేవాడా! సుఖదుఃఖాది ద్వంద్వ భావాలయందు సమభావం కలవారి అంతశ్శత్రువులను నశింపజేసేవాడా! భావించిన కొలది మనస్సుకు ఆనందం కలిగించే గొప్పదైన మహిమ కలవాడా! హరిహరనాథా!

**క.** **భసిత పరభాగ! హేలా । లసిత శ్రీవత్స లలిత లాంఛన! పింఛ**
**ప్రసృమర రుచి శబలోరగ । విసృమర దీధితి కలాప వేష్టిత మౌళీ!** 455

**ప్రతిపదార్థం:** భసిత= బూడిదతో ఒప్పారే; పరభాగ!= శరీరంలోని ఒక (సగ) భాగం కలవాడా! (హరుడా!); హేలా= విలాసంగా; లసిత= ఒప్పారే; శ్రీవత్స= శ్రీవత్సమనే; లలిత= కోమలమైన, అందమైన; లాంఛన= గుర్తు (గుండెమీద పుట్టుమచ్చవంటి గుర్తు) కలవాడా!; (హరిరూపా); పింఛ= నెమలి ఈక యొక్క; ప్రసృమర= వ్యాపించే; రుచి= కాంతిచేత; శబల= చిత్రమైన వర్ణం కల; ఉరగ= (మెడలో హారంగా వ్రేలాడే) పాముయొక్క; విసృమర= వ్యాపించే; దీధితి= కాంతిగల; కలాప= చంద్రవంకచేత; వేష్టిత= చుట్టబడిన(అలంకరించబడిన); మౌళీ!= శిరస్సు కలవాడా!

**తాత్పర్యం:** శరీరంలో ఒక భాగం భస్మంతో అలంకరించుకొన్నవాడా! (హరరూపుడా!), మరొకవైపు విలాసంగా ఒప్పారే శ్రీవత్సమనే అందమైన గుర్తును అమర్చుకొన్నవాడా!(హరిరూపుడా!) తలపై ధరించిన పింఛం నుండి వెలువడే





కాంతులచేత చిత్రవర్ణాలతో వెలుగొందే సర్పహార కాంతులు ప్రసరించే చంద్రవంకతో అలంకరించబడిన శిరస్సుకలవాడా! హరిహరనాథా!

**విశేషం:** మొదటి రెండు సంబుద్ధులలో వరుసగా హరుడిని, హరిని కీర్తించి. ఆ తరువాత సంబుద్ధితో హరిహరనాథులను సంయుక్తంగా వర్ణించి తిక్కన హరిహరాభేద తత్త్వాన్ని ప్రదర్శించాడు.

**మాలిని.**

**క్షరణరహిత వృత్తీ! గ్రాహ్యభక్త ప్రవృత్తీ !**
**కరణ గమన లీలా! గాఢకారుణ్య శీలా!**
**స్మరణ శుభదమూర్తీ! మధ్యరశ్మి ప్రవర్తీ !**
**చరణ వినమదింద్రా! సంతతానంద సాంద్రా!** 456

**ప్రతిపదార్థం:** క్షరణ= నాశనం; రహిత= లేని; వృత్తీ!= ప్రవృత్తి కలవాడా!; గ్రాహ్య= తెలియదగిన; భక్త, ప్రవృత్తీ!= భక్తుల ప్రవృత్తి కలవాడా!; కరణ= ఇంద్రియాల యొక్క; గమన= ప్రసరణం యొక్క; లీలా!= విలాసం కలవాడా!; గాఢ, కారుణ్య, శీలా!= దట్టమైన దయాస్వభావం కలవాడా!; స్మరణ= తలచిన మాత్రంచేతనే; శుభ,ద, మూర్తీ!= మంగళం చేకూర్చే ఆకారం కలవాడా!; మధ్యరశ్మి= ఇడ, పింగళ, సుషుమ్న అనే మూడు నాడులలో మధ్య స్థానంలో ప్రసరించే సుషుమ్నా నాడి ద్వారంలో; ప్రవర్తీ!= ప్రసరించేవాడా!; చరణ, వినమత్+ఇంద్రా!= పాదాలకు నమస్కరించే ఇంద్రుడు కలవాడా! (అంటే పాదాలకు ఇంద్రాదులు సదా నమస్కరిస్తూ ఉంటారని భావం); సంతత+ఆనంద, సాంద్రా!= ఎడతెగని ఆనందంచేత సాంద్రమైనవాడా!

**తాత్పర్యం:** నాశనం లేని ప్రవృత్తి కలవాడా! భక్తులచేత తెలియదగిన ప్రవృత్తి కలవాడా! ఇంద్రియ ప్రసరణముయొక్క విలాసం కలవాడా! పరమ దయాస్వభావం కలవాడా! తలచినంత మాత్రంలోనే శుభాన్ని ప్రసాదించేవాడా! సుషుమ్నా నాడిలో ప్రవర్తిల్లేవాడా! ఇంద్రాదులు పాదాలకు చేసే నమస్కారాలను స్వీకరించేవాడా! నిరంతరమైన ఆనంద సాంద్రమైన స్వరూపం కలవాడా! హరిహరనాథా!

**విశేషం:** మాలిని వృత్త లక్షణం: ఒక్కొక్క చరణంలో న,న,మ,య,య గణాలు వరుసగా ఉంటాయి. తొమ్మిదవ అక్షరం యతిమైత్రి. ప్రాస నియమం ఉన్నది.

**గద్యము.**

**ఇది శ్రీమదుభయ కవి మిత్ర కొమ్మనామాత్య పుత్ర బుధారాధన విరాజి తిక్కన సోమయాజి ప్రణీతం బయిన శ్రీమహాభారతంబున భీష్మపర్వంబునందు సర్వంబును తృతీయాశ్వాసము.**
**శ్రీమదాంధ్ర మహాభారతమునందలి భీష్మపర్వము సమాప్తము.**

**తాత్పర్యం:** ఇది శుభంకరంగా ఉభయకవి మిత్రుడు, కొమ్మనామాత్యుడి పుత్రుడు, పండితులను గౌరవించటం వలన విరాజిల్లేవాడు అని కీర్తించబడే తిక్కన సోమయాజి రచించిన శ్రీ మహాభారతంలోని భీష్మపర్వం ముగిసే మూడవ అశ్వాసం.

**భీష్మపర్వంలోని తృతీయాశ్వాసం సమాప్తం.**

**శ్రీమదాంధ్ర మహాభారతంలోని భీష్మపర్వం ముగిసింది.**

# శ్రీమదాంధ్ర మహాభారతము

## భీష్మ పర్వము

## గద్య పద్య ప్రథమ పాద సూచి


| పద్యము | పుట |
|---|---|
| **అ** | |
| అంచిత తాలకేతు కిరణాళి | 25 |
| అంత | 267 |
| అంత | 267 |
| అంత | 353 |
| అంత | 430 |
| అంతఁ దెప్పిరి నీ కొడు కనికి | 189 |
| అంతఁ బోవక సూతు | 231 |
| అంతక విక్రముండు | 125 |
| అంతకుమున్న ధృష్టద్యుమ్న | 374 |
| అంతకు సేదదేఱి | 232 |
| అంత నంశుమంతుండు | 440 |
| అంత నపరాహ్ణంబయ్యె | 137 |
| అంత నపరాహ్ణంబయ్యె | 200 |
| అంత నరుణకిరణుం డన్వర్థా | 287 |
| అంత నొండొక సారథి | 284 |
| అంతయుఁ గనుంగొని | 179 |
| అంత వియత్తలం బుదాత్త | 335 |
| అంత విరాటుఁడు లయ | 257 |
| అందఱమేనుల గంగా | 134 |
| అందు నడుమ నరనాథుం | 298 |
| అంబకై పూనివచ్చి | 27 |
| అంబరము వగుల నార్చి | 229 |
| అంబు పవమానసూర్య | 103 |
| అంహోమర్దనుఁ డాజనార్దనుఁడు | 203 |
| అకట తండ్రి సచ్చినంత | 397 |
| అకట నితాంతలోభమున | 87 |
| అక్కట తండ్రిలేని మము | 404 |
| అక్కట పూజార్హులగు | 90 |
| అక్కడ నడచినం గౌంతేయా | 419 |
| అక్కడి బంధులఁ జంపుచు | 86 |
| అక్కుమారుండును దుర్ముఖుని | 376 |
| అగ్గలిక దూది దరికొను | 207 |
| అచలనిభుఁడగు నలంబసుఁ | 122 |
| అజాతశత్రుున కిట్లనియె | 398 |
| అట్టియెడ | 37 |
| అట్టియెడ | 117 |
| అట్టియెడ | 155 |
| అట్టియెడ | 194 |
| అట్టియెడ | 258 |
| అట్టియెడ | 331 |
| అట్టియెడ | 389 |
| అట్టియెడ | 408 |
| అట్టియెడం గనుంగొని | 123 |
| అట్టియెడం గురుపితా | 322 |
| అట్టియెడం గౌరవసైన్యంబు | 313 |
| అట్టియెడఁ గృష్ణార్జునులు | 65 |
| అట్టియెడ జయద్రథుండు | 289 |
| అట్టియెడ ధర్మతనయుం | 392 |
| అట్టియెడ ధృష్టద్యుమ్నుండు | 175 |
| అట్టియెడ నకులనందనుం | 291 |
| అట్టియెడ నర్జునుండు | 413 |
| అట్టియెడ నీకొడుకు | 159 |
| అట్టియెడ నీకొడుకు | 249 |
| అట్టియెడ భీష్ముండు | 44 |
| అట్టియెడ శిఖండి | 428 |
| అట్టియెడ సౌబలుండు | 304 |
| అట్టి సంకులసమరంబున | 306 |
| అట్టి సంకులసమరంబున | 368 |
| అట్టి సమయంబున | 267 |
| అట్టి సమయంబున శిఖండి | 302 |
| అట్లు దనవారు మేలుచే | 144 |
| అట్లు దాఁకుటయు వారల | 372 |
| అట్లు దాఁకుటయు | 323 |
| అట్లు వచ్చునా గదఁగని | 317 |
| అట్లు శ్రుతాయువు మూర్ఛిల్లినం | 173 |
| అడరి కురుసేనపై | 420 |
| అడరిన దానవుండు | 334 |
| అడరెఁ గాళింగనాయకుం | 167 |
| అడవి దరికొనిన | 227 |
| అడిదముఁ బలుకయునుం | 317 |
| అడుగుటయు నతండతని | 296 |
| అతఁడు దానికిఁ దలఁకక | 368 |
| అతఁడు దివ్యాస్త్రజాలంబు | 429 |
| అతఁడు ధన్వియగుట | 331 |





| పద్యము | పుట |
|---|---|
| అతఁడు నొచ్చిన తఱి | 27 |
| అతఁడు నొచ్చియు నాఁటించె | 416 |
| అతఁడు మఱియును | 106 |
| అతఁ డెంత సాటిచెప్పిన | 273 |
| అతఁడొండొక విల్లెత్తిన | 387 |
| అతనింగాంచి యధిక | 399 |
| అతని కప్పుడెదుర | 426 |
| అతని జయించునంచు | 146 |
| అతనితో నిట్లనియె | 59 |
| అతని మునుమటు | 420 |
| అతని యరదంబు | 174 |
| అతని రథరక్షకులు | 314 |
| అతిగుహ్యం బిది | 97 |
| అతి దృఢంబగు పాఁతు | 13 |
| అతిరయమున గురుఁడు | 211 |
| అతులిత రథప్రతానో | 50 |
| అత్తఱి నీతనయుం | 279 |
| అత్తఱి సురఖచరాదుల | 68 |
| అత్తెఱంగాచరింపనుం | 446 |
| అదలిచి ద్రోణుఁడు భీష్ముఁడు | 188 |
| అది యట్లుండెనప్పుడు | 325 |
| అది యట్లుండె నమానుష | 60 |
| అది యా బాణములెల్ల | 299 |
| అదియునుంగాక | 11 |
| అదియునుంగాక | 420 |
| అదియునుంగాక | 453 |
| అదియునుంగాక | 11 |
| అది శిక్షగాని రోషంబు | 451 |
| అధిప నానాప్రకార | 10 |
| అధిప నీ తనయుండు | 65 |
| అధిప నీవు సెప్పినట్టిద | 31 |
| అధిప పాండుసుతుల | 17 |
| అధిప భీమసేనుఁ డడరిన | 273 |
| అధిప యోగీశ్వరేశ్వరుండైన | 111 |
| అనఘ నీకెదిర్చి యని | 71 |
| అనయము నుగ్రంబగు | 83 |
| అనల జ్వాలలు పర్వు | 102 |
| అన విని గాంగేయుఁ డక్కట | 72 |
| అన విని నవ్వి పాండవుల | 346 |
| అన విని నవ్వి యొక్కఁడు | 265 |
| అన విని భీష్ముఁ డిట్టులను | 454 |
| అని విని యూఱడి నిద్రా | 297 |
| అనవుడు | 357 |
| అనవుడు | 397 |
| అనవుడు ధర్మతనయుండు | 149 |
| అనవుడు నతండు | 425 |
| అనవుడు నతండు దుర్దమ | 365 |
| అనవుడు నప్పరమేశ్వరుం | 102 |
| అనవుడు నప్పలుకులకు | 77 |
| అనవుడు నయ్యిరువురు | 378 |
| అనవుడు నవ్వికవ్వడికిం | 405 |
| అనవుడు నాంబికేయ | 370 |
| అనవుడు నేఁబెనఁగఁగ | 400 |
| అని తలంచి కుంభసంభవాది | 269 |
| అని తలంచి తొలంగి | 424 |
| అనితల నీవు పాండు | 241 |
| అని తెలివొందిన మొగంబుతో | 399 |
| అని తెలివొంది పలికిన | 454 |
| అని దేవాసురకోటి | 436 |
| అనినం గోపించి శిఖండియు | 410 |
| అనినం బ్రాగ్జ్యోతిషపతి | 347 |
| అనినఁ బ్రియమంది నగరికి | 360 |
| అనిన గుడాకేశు పలుకు | 84 |
| అనిన నట్లకాక యని | 447 |
| అనిన నట్లకాక యని | 240 |
| అనిన నాంబికేయుండు | 32 |
| అనిన నాతని పలుకులు | 414 |
| అనిన నా సూతనందనుండు | 370 |
| అనిన విని కుంభసంభవుండు | 250 |
| అనిన విని కృష్ణుం | 404 |
| అనిన విని చిఱునవ్వు | 191 |
| అనిన విని దేవకీనందనునకు | 77 |
| అనిన విని ధృతరాష్ట్రుం | 64 |
| అనిన విని ధృతరాష్ట్రుం | 111 |
| అనిన విని ధృతరాష్ట్రుండు | 219 |
| అనిన విని నదీసూనుండు | 326 |
| అనిన విని నవ్వి యతఁడి | 297 |
| అనిన విని నీ పుత్త్రుండు | 78 |
| అనిన విని పరాశర | 08 |
| అనిన విని యచ్యుతుం | 97 |
| అనిన విని యతండట్ల | 151 |
| అనిన విని యతండట్ల | 183 |
| అనిన విని యతండట్ల | 363 |
| అనిన విని యతండు | 432 |
| అనిన విని యనిమిష | 160 |
| అనిన విని యమ్మనుజపతికి | 17 |
| అనిన విని యర్జునుం | 198 |
| అనిన విని యాంబికేయుండు | 22 |
| అనిన విని యాంబికేయుఁడు | 58 |
| అనిన విని యా భూపాల | 301 |
| అనిన విని యోధవీరులగు | 280 |
| అనిన విని వారలందఱు | 45 |
| అనిన విని విష్ణుఁడాజిష్ణుని | 156 |
| అనిన విని వైచిత్రవీర్యుండు | 15 |
| అనిన విని సంజయుండతని | 10 |
| అనిన విని సంజయుండతని | 31 |
| అనిన విని సంజయుండతనికి | 80 |
| అనిన విని సంజయుండతనికి | 193 |
| అనిన విని సంజయుం | 306 |

| పద్యము | పుట |
|---|---|
| అనిన విన్వచ్చుండు | 385 |
| అనిన విశోకుండు | 278 |
| అనిన సవ్యసాచిసమయ | 207 |
| అని నియమించి కొలువు | 35 |
| అని నియోగించిన నతం | 362 |
| అని పలికి గాంగేయుం | 190 |
| అని పలికి గౌనయంబు | 299 |
| అని పలికి దీనమానసుండగు | 448 |
| అని పలికినం బద్మనాభుండు | 352 |
| అని పలికిన విని | 406 |
| అని పలికిన విని దుశ్శా | 355 |
| అని పలికిన శాంతనవునకుం | 400 |
| అని పలికి పారాశర్యుం | 32 |
| అని పలికి పార్థునిం | 91 |
| అని పలికి యచ్యుతుండుచిత | 157 |
| అని పలికి యప్పరమ | 110 |
| అని పలికి యలుకవొడమి | 358 |
| అని పలికి యూరకుండెం | 449 |
| అని పలికి సంజయు కరంబు | 30 |
| అని పలికి సంరంభంబున | 192 |
| అని పలికి సమరప్రకారంబునం | 424 |
| అని పలికి సుదర్శనంబుం | 203 |
| అని పలుకునంత | 389 |
| అని పలుమాటలాడి | 29 |
| అని పురికొల్పికొని | 234 |
| అని ప్రార్థించినం | 390 |
| అని బహుప్రకారంబులం | 27 |
| అని భీష్ముండు పలికినం | 347 |
| అని మఱియు ననేక | 244 |
| అని మఱియు నిదృశంబు | 96 |
| అని మఱియును | 89 |
| అని మఱియును | 359 |
| అనిమిషులప్డు సూచి | 441 |

| పద్యము | పుట |
|---|---|
| అనిమొన దేవదానవుల | 357 |
| అనిమొన నోర్తుభీష్మ | 405 |
| అని యగ్గించినం బొంగి | 149 |
| అని యగ్గించిరంత | 162 |
| అని యగ్గించెనంత | 176 |
| అని యతనికి దివ్యదృష్టి | 98 |
| అని యవ్వల నెఱింగించిన | 278 |
| అని యాడుతులువ మాటలు | 361 |
| అని యాతనివలనను | 333 |
| అని యిట్లయ్యిరువురు | 450 |
| అని యిట్లు నాలవనాఁడు | 241 |
| అనియె నని చెప్పిన | 327 |
| అనియె నప్పుడు గాంగేయుండు | 412 |
| అని యెఱింగించి బ్రహ్మ | 246 |
| అని రట్టియెడ | 260 |
| అనిలజ భీష్ములు దమతమ | 253 |
| అని తనూజుఁ డొక్కరుఁడు | 323 |
| అని వారలవలను సూప | 312 |
| అని వెండియు | 64 |
| అని వెండియుఁ బుండరీకాక్షుండు | 109 |
| అని వెండియు వివిధ | 94 |
| అని వేడికొని వినతుండయి | 245 |
| అని సంజయుండు పలవించు | 25 |
| అని సంజయుండు భీష్మ | 140 |
| అని సంప్రార్థనంబు సేసి | 104 |
| అని సకౌతుకంబుగా | 292 |
| అని సమయంబుసేసి | 67 |
| అనుచుఁ బటుశక్తి నప్పార్థుని | 438 |
| అనుచు నేచి యెదిరిన | 202 |
| అనుచు మఱియు నయిదమ్మ | 411 |
| అనుచు మొన గడచి | 250 |
| అనుచు వగచు పలుకు | 375 |
| అనుజుఁడు వడ్డ శంఖుఁడు | 136 |

| పద్యము | పుట |
|---|---|
| అనుటయుఁ గౌరవులును | 446 |
| అనుటయుఁ గ్రీడియిట్టు | 404 |
| అనుటయు నట్లకాక | 198 |
| అనుటయు నతఁడిట్లను | 450 |
| అనుటయు నర్జునుండు | 385 |
| అనుటయు నాతండిట్లను | 242 |
| అనుటయు నా సూతనందనుం | 407 |
| అనుటయు నిట్లను గంగా | 401 |
| అనుటయు వైశంపాయను | 03 |
| అనుటయు సంజయుండతని | 111 |
| అనుటయు సంజయుండది | 58 |
| అనుడు దయార్ద్రచిత్తు | 105 |
| అనుడు నతండు | 04 |
| అనుడు నతఁడు పాండవా | 380 |
| అను నట్టియెడ నర్జునుండు | 205 |
| అనునెడ శిఖండి చాపము | 437 |
| అనురూపములగుమాటొడ్డనముల్ | 154 |
| అపరాహ్ణసంగతుండగు | 267 |
| అపరాహ్ణసమయమున | 286 |
| అపుడు సేరి భీముఁడతనికి | 350 |
| అప్పలుకు లాకర్ణించి | 439 |
| అప్పుడనూపభూపాలుండును | 344 |
| అప్పు డపరాహ్ణంబయ్యె | 233 |
| అప్పు డర్జునుండు కేశ | 209 |
| అప్పు డా కళింగపతి | 169 |
| అప్పుడింద్రనందనుండు | 299 |
| అప్పుడిరావంతుండు | 330 |
| అప్పుడు | 386 |
| అప్పుడు | 439 |
| అప్పుడు కృష్ణార్జునులు | 83 |
| అప్పుడు క్రోధమునంగను | 419 |
| అప్పుడు గయ్యంబు సాలించి | 140 |
| అప్పుడు గాంగేయుండు సేయు | 373 |







| పద్యము | పుట |
|---|---|
| అప్పుడు దేవవ్రతుండు | 437 |
| అప్పుడు ద్రౌపదేయులు | 365 |
| అప్పుడు ధర్మజ భీమ నకుల | 414 |
| అప్పుడు పెక్కండ్రు రథికుల | 368 |
| అప్పు డుబ్బి దుర్యోధనుఁ డతి | 235 |
| అప్పు డుభయ సైన్యంబుల | 366 |
| అప్పుడు భీష్ముఁ డెంతయు | 204 |
| అప్పుడు మధ్యందినమున | 282 |
| అప్పుడు మన బలంబుల | 375 |
| అప్పుడు రెండు సైన్యములు | 67 |
| అప్పుడు శల్యనందనుండు | 216 |
| అభిమన్యు ద్రుపదసుత | 225 |
| అమరతటినీతనూజుపై | 77 |
| అమరతరంగిణీ తనయు | 132 |
| అమరు తొడవుల వజ్రాంశు | 43 |
| అమ్మాట మనమునకు | 357 |
| అమ్ముల నేనుఁగు కొమ్ముల | 237 |
| అమ్మెయిఁ గౌరవులును | 252 |
| అయిదు నారసముల | 173 |
| అయిన నీతో నప్పటికప్పటి | 385 |
| అయ్యవసరంబున | 236 |
| అయ్యవసరంబున గాంగేయుండు | 45 |
| అయ్యవసరంబున దుర్యోధనుండు | 153 |
| అయ్యాదవసింహుండు | 310 |
| అయ్యిరావంతుం డొక్కరుండును | 333 |
| అయ్యేడ్పుతో నిట్లని | 23 |
| అరదంబు రవము సెలఁగఁగ | 229 |
| అరదంబులు పొడిపొడియై | 276 |
| అరదములు దీవులున్నత | 62 |
| అరదములు రథికవరులును | 184 |
| అరదములు సవరణలతో | 37 |
| అరిబలంబుపై నొక్క దివ్యాస్త్ర | 430 |
| అరుణములును సితంబులు | 63 |

| పద్యము | పుట |
|---|---|
| అర్కునుదయాస్తమయముల | 06 |
| అర్జున చూచితే మన | 384 |
| అర్జునుం డదరి ద్రోణాచార్య | 371 |
| అర్జునుఁ డప్డు భీష్ముఁ గని | 117 |
| అఱవఱలైన రథంబులు | 195 |
| అఱిముఱి గుఱ్ఱపుదడముల | 325 |
| అఱిముఱి నడరిన | 178 |
| అఱిముఱి నీకుమారవరు | 254 |
| అలయ కరయనోపిన | 445 |
| అలవి యెఱుంగనేరక | 145 |
| అలికి యతఁడు సూతుతల | 257 |
| అలిగి దశార్ణాధీశుఁడు | 349 |
| అలుకదక్కి నన్ను నధిక | 450 |
| అవని గంపింప అలిత | 203 |
| అవియెల్లను బైఁగురియఁగ | 158 |
| అశని కల్పము లివి యర్జును | 437 |
| అసుర కినిసి కృతాంత | 338 |
| అసురదళన లీలావ్యాప్తి | 293 |
| అసుర వెండియుఁ బెక్కు | 367 |
| అస్త్రవర్షంబుఁ గురియంగ | 280 |
| **ఆ** | |
| ఆఖండల నందనుండును | 427 |
| ఆ ఘటోత్కచుండు దివిజులకు | 339 |
| ఆచార్య ప్రభృతులగు | 239 |
| ఆచార్యుఁ దీవ్రఘననారాచము | 163 |
| ఆతఁడు చిత్రసేనుని | 261 |
| ఆ తూపులు నటికి పరిస్ఫీతం | 416 |
| ఆత్మయోధులకెల్ల | 23 |
| ఆ ధృష్టద్యుమ్నుండును గలయ | 61 |
| ఆ ధృష్టద్యుమ్నుండు సక్రోధుండై | 163 |
| ఆ నినదము విని పాండవ | 66 |
| ఆపగానందనుండు మురారి | 161 |
| ఆ పదివేవురు నెఱ | 379 |

| పద్యము | పుట |
|---|---|
| ఆ పన్నిద్దఱు సైన్యాటోప | 282 |
| ఆ పృషతపౌత్రుఁ డుద్దత | 216 |
| ఆ బెట్టిదంపుటంపఱచే | 387 |
| ఆ రథనివహంబులు | 254 |
| ఆరయ విపృత స్వర్గద్వారము | 44 |
| ఆ రాత్రి ధర్మతనయుండు | 144 |
| ఆ రాత్రి నిన్ను వీడుకొని | 33 |
| ఆ రెండు బలములందును | 64 |
| ఆ రౌతులు వీఁడు గాలుమానిసి | 332 |
| ఆర్తుఁడై యవ్విశోకుని | 277 |
| ఆర్వురును గడంగి హయముల | 332 |
| ఆలోనన తెప్పిఱిలయ | 365 |
| ఆలోనన తెలిసి మెఱుఁగు | 369 |
| ఆలోనన మెయిఁ దొమ్మిది | 378 |
| ఆ విల్లు ద్రుంచి రౌద్రరసావేశం | 283 |
| ఆ వెల్లువ శరజిహ్వాల | 161 |
| ఆ శౌర్యం బాసత్త్వం బాశీలం | 27 |
| ఆ సమయంబునం గృపశల్య | 429 |
| ఆ సాత్యకి వేటొక విల్లాసుర | 369 |
| ఆ సేనకుం దలకడచి | 207 |
| ఆ సౌభద్రుం డుగ్రపు వేసవి | 262 |
| **ఇ** | |
| ఇంకఁ బశ్చాత్తాపం బుడిగి | 274 |
| ఇంక నమ్మాటలాడుట | 327 |
| ఇంక నేమేనియుం జెప్పఁ | 443 |
| ఇంటం దెవులనఁ జచ్చుట | 44 |
| ఇంత పాపంబు సేయంగ | 88 |
| ఇచ్చటికి మీర లందఱు | 399 |
| ఇటు దగునయ్య కృష్ణ | 206 |
| ఇట్టి వానిఁగ నన్ను మీరెఱిఁగి | 401 |
| ఇట్టు లగుటఁ జేసి యెవ్వరి | 92 |
| ఇట్టులాడి పిదప నేమియు | 411 |
| ఇట్లతిరథ మహారథులం | 341 |

| పద్యము | పుట |
|---|---|
| ఇట్లాభీలంబుగా భగదత్తు | 237 |
| ఇట్లు కర్ణసౌబలుల | 355 |
| ఇట్లుక్కు మిగిలి యెక్కిన | 330 |
| ఇట్లు క్రూర నారాచంబు | 302 |
| ఇట్లు క్రేడించి గాంగేయు | 159 |
| ఇట్లు గలయన్‌బెరసి | 381 |
| ఇట్లు గవిసి | 138 |
| ఇట్లు గవిసి | 217 |
| ఇట్లు గవిసి | 364 |
| ఇట్లు గాంగేయుఁ డేయు | 199 |
| ఇట్లు చిత్రసేనుండు | 317 |
| ఇట్లు తృప్తిఁ బొంది మందాకినీ | 448 |
| ఇట్లు దండ్రినొచ్చినఁ బాండు | 343 |
| ఇట్లు దన్ను బెట్టుగిట్టిన | 336 |
| ఇట్లు దఱిమి గాంగేయు | 421 |
| ఇట్లు దాఁకి తోమరప్రాస | 212 |
| ఇట్లు దాఁకి విరటు తమ్ముండు | 431 |
| ఇట్లు దుశ్శాసనుండు సోలి | 416 |
| ఇట్లు దేవవ్రతుండు | 428 |
| ఇట్లు దొడంగి యుద్ధట | 214 |
| ఇట్లు ద్రుంచి | 378 |
| ఇట్లు ద్రోణుండు ద్రుపదుం | 281 |
| ఇట్లు ధర్మతనయుండు | 393 |
| ఇట్లు ధృతరాష్ట్రునకుం | 05 |
| ఇట్లు ధృష్టద్యుమ్నుండు | 216 |
| ఇట్లు ధృష్టద్యుమ్నుండు | 284 |
| ఇట్లు నడచి కురుక్షేత్రంబు | 56 |
| ఇట్లు నిలిపి యార్చి | 227 |
| ఇట్లు నిలువరించి | 415 |
| ఇట్లు నీ కొడుకులు | 275 |
| ఇట్లు నొచ్చిన వికర్ణుం | 290 |
| ఇట్లు పనిచినం బార్థుం | 444 |
| ఇట్లు పలువురు ధరణీశు లురవ | 318 |

| పద్యము | పుట |
|---|---|
| ఇట్లు పాండవవ్యూహంబు | 392 |
| ఇట్లు పాండవ సైన్యంబు | 139 |
| ఇట్లు పితామహునెత్తి | 46 |
| ఇట్లు పుత్రశోకానల | 351 |
| ఇట్లు పెక్కండ్రతోడం | 215 |
| ఇట్లు పెద్దయుం బ్రొద్దు | 423 |
| ఇట్లు పేర్చి కురుబలంబు | 262 |
| ఇట్లు ప్రతిభటతురంగ | 113 |
| ఇట్లు ప్రళయ కాలతాండవం | 131 |
| ఇట్లు బలంబుల నిలిపి | 190 |
| ఇట్లు బల్లిదుండయి | 383 |
| ఇట్లుభయ సైన్యంబులుం | 347 |
| ఇట్లు భానుమంతునంతకు | 170 |
| ఇట్లు భీమసేనుఁ జేరంబోయి | 279 |
| ఇట్లు భూచారియయిన | 331 |
| ఇట్లు మాఱులేక తఱుము | 364 |
| ఇట్లు మూర్ఛితుండయిన | 308 |
| ఇట్లు మెఱసిన | 117 |
| ఇట్లు లంఘించి | 388 |
| ఇట్లు వడిన కొడుకులం | 266 |
| ఇట్లు వఱపిన నతని | 271 |
| ఇట్లు విరథుండునువిశిఖ | 305 |
| ఇట్లు వెడలి మకరవ్యూహం | 247 |
| ఇట్లు శ్రుతాయువు సేయివీచిన | 171 |
| ఇట్లు సన్నద్ధుండయి | 360 |
| ఇట్లు సారథి వడుటయు | 175 |
| ఇట్లు సునాభుండువడుట | 324 |
| ఇట్లు సుస్థిరుండై | 158 |
| ఇట్లు సేన మొగ తిరిగినం | 255 |
| ఇట్లు సేసిన విని | 339 |
| ఇట్లు సొచ్చి వృకోదరుండు | 166 |
| ఇట్లెదిర్చినం జూచి | 229 |
| ఇట్లేసి యార్చి వెండియు | 349 |

| పద్యము | పుట |
|---|---|
| ఇట్లొప్పి సేనాపతియగు | 55 |
| ఇతఁడు పాంచాలురాదిగ | 361 |
| ఇతని తలం పే నెఱింగితి | 70 |
| ఇతరేతర శరకృత | 367 |
| ఇత్తఱి మనుష్యభువనం | 244 |
| ఇత్తెఱంగునం దలపడి | 230 |
| ఇత్తెఱంగున నిజ పుత్రుఁ | 219 |
| ఇత్తెఱంగున నెక్కువ | 162 |
| ఇది కృష్ణద్వైపాయనుండు | 452 |
| ఇది మున్న యేనుద్రోణుఁడు | 326 |
| ఇదె యేనుఁ గూడవచ్చితి | 279 |
| ఇద్దెస సుబల తనూజుఁడు | 311 |
| ఇనుమును రాగియుఁ దగరం | 19 |
| ఇప్పరమోపాయంబు | 108 |
| ఇప్పు డే నూరకున్నం | 201 |
| ఇమ్మెయిఁ గిట్టి వాయుసుతు | 325 |
| ఇరుపదేనమ్మల | 158 |
| ఇరువురఁ గృష్ణుల | 415 |
| ఇలఁ గ్రీడగఁ బుట్టిన | 246 |
| ఇలఁబడిన సహచరుల | 314 |
| ఇల ధూళి యెగసిన | 55 |
| ఇవ్విధంబున | 240 |
| ఇవ్విధంబున | 217 |
| ఇవ్విధంబునం జెప్పిన | 97 |
| ఇవ్విధంబునం బెక్కు | 422 |
| ఇవ్విధంబునం బోరు | 350 |
| ఇవ్విధంబున బ్రతి | 52 |
| ఇవ్విధంబునఁ గ్రందు | 185 |
| ఇవ్విధంబునఁ బార్థున | 106 |
| ఇవ్విధంబున గజంబులు | 337 |
| ఇవ్విధంబున ధర్మనందన | 273 |
| ఇవ్విధంబునఁ దాఁకి | 229 |
| ఇవ్విధంబున నద్భుత | 168 |







| పద్యము | పుట |
|---|---|
| ఇవ్విధంబున నాచార్యుం | 320 |
| ఇవ్విధంబున నాచార్యు | 281 |
| ఇవ్విధంబున భూమధ్యంబున | 13 |
| ఇవ్విధంబున విషమంబగు | 196 |
| ఇవ్విధంబున వృకోదరు | 113 |
| ఇవ్విధంబున వెండియు | 126 |
| ఇవ్విధంబున శతానీకుం | 431 |
| ఇవ్విధంబున శోకసంవిగ్న | 88 |
| ఇవ్విధంబున హిడింబాసూనుండు | 345 |
| ఇవ్విధమున నాయితమై | 111 |
| **ఈ** | |
| ఈయనతో రణ మిప్పుడు | 240 |
| ఈసునఁ దానుఁ దమ్ములు | 230 |
| **ఉ** | |
| ఉక్కఱి యొండొకనిరథం | 316 |
| ఉక్కున మూఁడు లోకములు | 190 |
| ఉక్కు మిగిలి జగతీశులు | 312 |
| ఉగ్ర గ్రహములు లయకాల | 275 |
| ఉత్తమ క్షత్రియులనెల్ల | 423 |
| ఉత్తర సముద్రంబు | 14 |
| ఉద్యతులై కవలును | 113 |
| ఉద్యద్విక్రములైన | 148 |
| ఉన్నచోటన కదలక | 189 |
| ఉపప్లావ్యంబున నితండు | 396 |
| ఉభయ బలదీప్త కేతు | 62 |
| ఉభయసేనలుఁ దమ | 140 |
| ఉరమునఁ గటిమైఁ దొడలం | 228 |
| ఉరవడించు సమయంబున | 112 |
| ఉఱక నరుఁ డట్టు | 259 |
| ఉఱక విరాటుబలముపై | 138 |

| పద్యము | పుట |
|---|---|
| **ఊ** | |
| ఊర్జిత శాత్రవసేనా | 189 |
| **ఎ** | |
| ఎండిన యడవిన్ దరికొని | 138 |
| ఎడఁజొచ్చి చిత్రసేనుఁడు | 316 |
| ఎడనెడఁ బఱపై యొప్పెడి | 20 |
| ఎన్నఁడును మున్ను వారల | 250 |
| ఎన్ని శరముల నభిమన్యు | 261 |
| ఎరగలి చిచ్చు గాఱడవి | 145 |
| ఎలమి నమస్కరించుచు | 393 |
| ఎలసి పయివారి దంతి | 65 |
| ఎల్లభంగుల గురు | 90 |
| ఎల్లభువనములను | 87 |
| ఎల్లవారిఁ గాచు | 34 |
| ఎవ్వతనేని ధాత | 410 |
| ఎవ్వరికిఁగాఁగ ధరణియు | 86 |
| **ఏ** | |
| ఏచి దుర్యోధనుండును | 155 |
| ఏచి ధృష్టద్యుమ్నుఁ డేడ్తెఱ | 121 |
| ఏనవనాఁటి రాత్రి సనుటయు | 269 |
| ఏ నాయుధవ్యాపారంబువలన | 401 |
| ఏనిక మదమున | 48 |
| ఏనుంగు వడిన నచ్చటి | 338 |
| ఏనుఁగు నెత్తుట గదయుం | 226 |
| ఏనుఁగుల మదము తావియు | 57 |
| ఏనును నాదళమున | 360 |
| ఏపున హిడింబసుతుఁడును | 344 |
| ఏమఱి రక్షసాలని | 35 |
| ఏ మెల్లనుండ నీ విట్లుంటి | 69 |
| ఏయుఁడు పొడువుం | 439 |

| పద్యము | పుట |
|---|---|
| ఏయుమొక నేర్పుమై | 410 |
| ఏవురు ద్రౌపదేయులును | 290 |
| ఏసి గాండీవి కురుసేన | 439 |
| ఏసి తురంగంబుల | 258 |
| ఏసి యా రెంటిఁ దునియలు | 439 |
| **ఐ** | |
| ఐనను గ్రౌంచవ్యూహ | 153 |
| ఐనను నాచేతి బలుపు | 413 |
| ఐనను నోపిన భంగిని | 192 |
| **ఒ** | |
| ఒంటిమైఁ గళింగు నురవడి | 176 |
| ఒండొక చాపమెత్తి | 165 |
| ఒండొరు చండవిక్రమము | 162 |
| ఒండొరుల గెలుచు తలఁపున | 02 |
| ఒకఁ డొకఁడ పాండుపుత్త్రుల | 153 |
| ఒకని నొకని నై దైదు | 366 |
| ఒక్క విల్లెక్కుపెట్టంగ | 435 |
| ఒక్క కరంబు మలంచి | 451 |
| ఒక్కటఁ గడంగి శల్యుని | 380 |
| **ఓ** | |
| ఓర్వరాక దానవోత్తము | 341 |
| **క** | |
| కంటె గాంగేయు నతని | 363 |
| కడఁగి నడచి మాయగావింప | 333 |
| కడఁగి సుయోధన ప్రభృతి | 194 |
| కడుఁ బెద్దకాలంబు గాంక్షించి | 288 |
| కడు వడిఁ జని యంతంతం | 279 |
| కడువడితోడ నప్పుడు | 251 |
| కడువెసఁ గవిసిన | 268 |
| కనక భూషణజాలంబు | 36 |
| కని కడు నలిగి సుభద్రా | 232 |

| పద్యము | పుట |
|---|---|
| కని కృప బాహ్లికాది | 343 |
| కని కౌరవపతి దుశ్శాసనుతో | 378 |
| కని తమకించి బలంబులు | 185 |
| కని తే రుప్పరవీధిఁ దోలుకొని | 178 |
| కని యతఁడు దెలిసి నీచే | 351 |
| కని యభిమన్యు ముఖ్యు | 235 |
| కని యల్లన నవ్వుచు | 214 |
| కనుంగొను జనంబులు | 260 |
| కనుఁగొని కురుపతి | 251 |
| కనుఁగొని కోపంబున | 161 |
| కనుఁగొని పార్థుం డపుడు | 283 |
| కనుఁగొని భీష్ముఁడుల్లము | 389 |
| కనుఁగొని శిఖండి వెస | 409 |
| కనుఁగొని సాత్యకి యేనుం | 256 |
| కనుఁగొని సైన్యముల్ విఱిగి | 345 |
| కన్నాకు మనకు భీష్ముం | 34 |
| కప్పారు రేణువు గమలాప్త | 114 |
| కయ్యము సేయక తగు | 396 |
| కయ్యము సేయనేనని | 390 |
| కరదంత కర్ణమస్తక | 336 |
| కరమున నున్న శూలమున | 335 |
| కరికర శీకర తురగో | 116 |
| కరిఘంటా నిచయస్వనంబులు | 115 |
| కరిఘటలు మీఁద భీముఁడు | 329 |
| కరుల సందడి నొప్పు | 52 |
| కలయఁగఁ గరముల | 373 |
| కల్పిత దృఢ చతురంగా | 39 |
| కవలుద్దామ పరాక్రమ | 409 |
| కవిసి బలముఁ జంపఁగ | 235 |
| కవిసి యుగాంతదండధరు | 276 |
| కవిసి వ్రేసిన గ్రక్కున | 218 |
| కాంచనమయ వేదికా | 38 |
| కాంభోజరాజగు సుదక్షిణుం | 41 |

| పద్యము | పుట |
|---|---|
| కారుకొని మేఘమాలా | 211 |
| కార్చిచ్చు గనిసి మృగతతి | 393 |
| కాలంబగుటయు నృపులకు | 04 |
| కాలు కాలు పెనఁగి కాలు | 409 |
| కాల్పుడే మహనీయఖాండవం | 358 |
| కావున | 63 |
| కావునఁ గౌరవపాండవు | 22 |
| కావున నీ యుద్భటరథి | 35 |
| కినుక వొడమి గంగా | 77 |
| కిమ్మీరమర్దనునిచే | 292 |
| కిరణంబు లడఁగి యంతకు | 268 |
| కీడొనరించిన వారికి | 31 |
| కుంతీసూనుఁడు సింహనాదమున | 170 |
| కురుపతికిఁ జిత్రసేనుఁడు | 260 |
| కురుపతియు ననుజవర్గము | 429 |
| కురుపతి యొక నారాచంబు | 285 |
| కురు పాండవ సైన్యంబుల | 116 |
| కురురాజు యోధవీరుల | 263 |
| కురువిభుఁడు నగరు సొచ్చియు | 354 |
| కురుసేనఁ జూచి యప్పుడు | 211 |
| కులగురువృద్ధు నిర్మలచిత్తు | 28 |
| కులనాశము సేసిన | 87 |
| కూలెడు గుఱ్ఱంబులు ధర | 420 |
| కృతవర్మ యేచి మారుత సుతు | 305 |
| కృతవర్మ రథము డిగి | 137 |
| కృపగురు భీష్మయుక్తముగ | 197 |
| కృష్ణసారథ్యమున నొప్పు | 180 |
| కృష్ణార్జునాదులుం దోడన | 74 |
| కెడసె హయము లొడ్డగెడవయ్యె | 209 |
| కేకయు లేపుర బలములు | 138 |
| కైలాస శైలాకారంబును | 236 |
| కొందఱ సూతులు వొలిపిరి | 341 |
| కొడుకుపాటుఁ జూచి కోపించి | 169 |

| పద్యము | పుట |
|---|---|
| కొడుకుల దెస నెవ్వగ | 22 |
| కొడుకులుఁ దమ్ములు గుఱ్ఱపు | 40 |
| కొన్నిటి హస్తముల్ సదియ | 225 |
| కొన్ని భూముల బలములు | 63 |
| కొఱవియుఁ గొఱవియు | 137 |
| కోదండదశక శీఘ్రచ్ఛేదం | 266 |
| కోపము సంహరింపు యదుకుం | 206 |
| కౌంతేయుండు నగుదునిది | 452 |
| కౌరవబలములు దిరిగిన | 203 |
| కౌరవబలములు నుడివడ | 342 |
| కౌరవ వ్యూహమునకు | 61 |
| కౌరవులలోన నిప్పు డెవ్వారితోడ | 84 |
| కౌరవులు ప్రకంపగాఢ | 447 |
| క్రందుఁ గయ్యంబులోన నరాతి | 282 |
| క్రందుకొని యిట్లు మాతంగ | 373 |
| క్రందుకొను సర్వధర్మ | 107 |
| క్రమ్మఱంగ నేతెంచుగాక | 73 |
| క్రూరతకోర్చి యించుకయు | 404 |
| క్షరణ రహిత వృత్తి | 456 |
| క్షాత్రము దలకొని సంగర | 370 |

గ

| పద్యము | పుట |
|---|---|
| గంగయుఁ దుంగభద్రయు | 19 |
| గంగానందనుఁ గూర్చి ద్రోణుపని | 202 |
| గంగానందనుఁ దాఁక నర్జునుఁడు | 258 |
| గంగాపుత్రుఁడు పాండవాగ్రజుని | 318 |
| గజఘటలం గనుంగొని | 223 |
| గజారాజోజ్జ్వల ఘంటికావళి | 382 |
| గజిబిజి లేక యుబ్బక | 156 |
| గతి గుందియుఁ బైఁదొరఁగెడు | 166 |
| గర్వంబు మెఱయ శిఖండి | 122 |
| గాంగేయుచేత నెంతయు | 392 |
| గాండీవం బింద్రచాపంబు | 50 |





| పద్యము | పుట |
|---|---|
| గాండీవి గెలువరాదు | 359 |
| గిరి డిగు కేసరి చాడ్పున | 372 |
| గురుఁడను నురుతరగిరి | 165 |
| గురుఁడు భీష్ముండుఁ గలుగంగ | 327 |
| గురుఁడు మొదలైన | 345 |
| గురుఁడు విరాటుని కోదండ | 301 |
| గురు వంపవెల్లి నాఁగుచు | 352 |
| గురునిఁ గృతప్రజ్ఞుని | 403 |
| గురుసుతు బెడిదపు | 259 |
| గెలిచితి రాజులనెల్లను | 410 |
| గొదగొని ధార్తరాష్ట్రు లతిఘోర | 278 |

ఘ

| పద్యము | పుట |
|---|---|
| ఘోరఖడ్గంబున వానిం దునుము | 339 |
| ఘనతర గర్జాధ్వనులును | 112 |
| ఘనతర శోకవేగమున | 351 |
| ఘనమయి తోఁచుచున్న యది | 59 |
| ఘనశక్తి వైవ నది | 174 |

చ

| పద్యము | పుట |
|---|---|
| చండభుజాబలంబు | 53 |
| చండవిరోధి తిమిరమార్తాండు | 260 |
| చంద్రార్కులు లోచనంబులుగా | 101 |
| చలదుర్వీధరలీలఁ గ్రాలు | 40 |
| చలముకొని యొరుల | 45 |
| చాపము వేడ్కఁ బుచ్చికొని | 172 |
| చాపవక్త్రుండు భల్లదంష్ట్రా | 24 |
| చావును నోవును మన | 219 |
| చిచ్చఱ కన్నుమూసికొని | 400 |
| చిత్రసేనుండు సౌభద్రు | 376 |
| చిన్నబోయి నీ కొడుకులు | 241 |
| చుట్టరికంబునన్ మనసుసొచ్చి | 73 |
| చూడు మాచార్య నీదు | 81 |

| పద్యము | పుట |
|---|---|
| చెంగట నభిమన్యుండు పిశంగ | 364 |
| చెప్పిన నతండు వారిం | 354 |
| చేకితానుండు గృపునిపై | 310 |
| చేదిపతియగు ధృష్టకేతుండు | 311 |
| చేయంగల పని యెయ్యది | 147 |
| చేయఁ దొడంగిన గాంధారేయులు | 184 |
| చొచ్చి చతురంగ వితతులు | 287 |
| చొచ్చి పితామహుంగని | 248 |

జ

| పద్యము | పుట |
|---|---|
| జంబూనది యనంబరఁగిన | 12 |
| జగములకు నాదికారణమగు | 101 |
| జగ మెఱుగంగ ద్రోణు నని | 150 |
| జననాథులపైఁ బెల్లేసిన | 299 |
| జననీవంశంబునఁగల | 334 |
| జనియించినంతనుండియు | 424 |
| జలరుహంబులు పాండవ | 139 |

డ

| పద్యము | పుట |
|---|---|
| డొల్లెడు తలయును | 130 |
| డొల్లెడు సూతులు | 423 |

త

| పద్యము | పుట |
|---|---|
| తగని పనియని తలంపక | 359 |
| తగునె యర్జున యీ | 89 |
| తడఁబడె దివ్యబాణముల | 419 |
| తదనంతరంబ | 116 |
| తదనంతరంబ | 178 |
| తదనంతరంబ | 259 |
| తదనంతరంబ యుధిష్ఠిరుండు | 150 |
| తదనంతరంబ శత్రు | 83 |
| తదనంతరంబ సాత్యకియు | 134 |
| తదవసరంబునం బతి | 187 |
| తదవసరంబునఁ బొదివి | 286 |

| పద్యము | పుట |
|---|---|
| తదవసరంబున | 282 |
| తదవసరంబున నంబర | 443 |
| తదవసరంబున నితని | 79 |
| తదవసరంబున నుభయ | 67 |
| తదవసరంబున వృకోదరుం | 348 |
| తదవసరంబున శిఖండి | 315 |
| తదవసరంబున సరభసంబున | 427 |
| తదవసరంబున సాత్యకి | 175 |
| తదవసరంబున సాత్యకితో | 417 |
| తదవసరంబున సూక్ష్మజల | 434 |
| తనకుఁ గ్రీఁదల యని | 443 |
| తనతన శంఖంబును | 82 |
| తనతోఁ గాల్పురు సాల | 41 |
| తనదు నొప్పున కలుకక | 198 |
| తన భుజసార మేర్పడఁగ | 159 |
| తన ముందటి యోధులు | 271 |
| తన యరదంబు విశోకుఁడు | 284 |
| తనయుఁడు నొచ్చిన | 177 |
| తన విక్రమంబు సేనలు | 136 |
| తనువుధరఁ బొందకుండఁగఁ | 440 |
| తన్నుం దాన యుపశమించుకొని | 361 |
| తమకుం దమ యోధవీరులకు | 436 |
| తమతమ దేశంబులకై | 17 |
| తమ్ములఁ దోలిన నతిరౌద్ర | 286 |
| తమ్ముల నొంచిన నగ్రజు | 318 |
| తమ్ములు వీఁగినం బతి | 231 |
| తఱికింజొచ్చి కడంగి | 215 |
| తఱిమి వికర్ణుడప్పు | 290 |
| తఱిమి సాత్యకి గృతవర్మ | 118 |
| తఱిమి సుశర్మొండు దాఁకి | 377 |
| తలఁకెడు వాఁడు గాఁడు | 238 |
| తలకడచి నడచు ద్రోణుని | 271 |

| పద్యము | పుట |
|---|---|
| తలకొని నీకుం బ్రాణంబులు | 358 |
| తలపడి నానాస్త్రముల | 262 |
| తలపడి యంత్యకాలశిఖి | 264 |
| తలపడి యగ్గురు నందను | 344 |
| తల వ్రయ్యలైనఁ బ్రాణంబులును | 218 |
| తాఁకి యుజ్జ్వలబాణతతి | 250 |
| తాటి సిడము విఱిగి | 132 |
| తాతల మామలన్ సుతుల | 86 |
| తాన స్తశిఖరి మఱువడ | 399 |
| తిమిరము గవిసినఁ బాండవ | 354 |
| తిరిగిన పందల నేటికి | 206 |
| తుంగమడువున నాడు | 228 |
| తుండంబులు గావించి | 303 |
| తునిమి తోడన క్రొవ్వాఁడి | 342 |
| తునిసిన బాహా మస్తక | 195 |
| తురగనికరంబు తోడం | 89 |
| తూర్పు తలగాఁగ నీ సుతు | 440 |
| (తూలె) నట్లు దూలిన | 428 |
| తెరలక లక్ష్మణుండు | 263 |
| తొమ్మిది ఖండములై | 14 |
| తొల్లి గురుండు దానవులతోడి | 151 |
| తోడంబుట్టువుపాటు సూచి | 335 |
| త్రిగర్తపతి మొదలయిన | 300 |
| త్రుంచి నవ్వుచు | 366 |

ద

| పద్యము | పుట |
|---|---|
| దనుజ ఖండితుండయి పడి | 351 |
| దనుజపతి యేచి దుర్యో | 237 |
| దనుజాఁడు మాయాధికుఁ డర్జున | 366 |
| దనుజు లొనరించు మాయలు | 347 |
| దనుజేంద్రు నిలుచుట | 307 |
| దనుజేశ్వరుండు మాయం | 367 |
| దాని కతండు చలింపక | 285 |
| దాని కయ్యుధిష్ఠిరుండు | 57 |
| దానికిం గినిసి శినిమనుమండు | 369 |
| దానికిఁ జల మెడలక | 338 |
| దానికి ద్రోణకృతవర్మలు | 182 |
| దారుణరోషం బడరఁగ | 387 |
| దిక్కులఁ దన బాణంబులు | 137 |
| దివ్యరథస్ఫార దీప్తిజాలంబులు | 49 |
| దుర్యోధను దుర్ణయంబున | 220 |
| దుర్యోధను మాటకు భుజ | 193 |
| దుశ్శాసన వికర్ణ చిత్రసేనులతో | 311 |
| దుశ్శాసన వికర్ణ విందాను | 354 |
| దూరాంతిక దుర్గమ విస్తార | 141 |
| దెప్పరపుఁజోట నీకీయొప్పని | 89 |
| దేవ నీదగు దివ్యదేహంబు | 100 |
| దేవవ్రతుండు దెగిన | 28 |
| దేవవ్రతు పలుకులు | 425 |
| దేవా వైశంపాయనుండు | 144 |
| దేవా వైశంపాయనుండు | 295 |
| దేవా జనమేజయ వసుధా | 02 |
| దేవా సురవరు లొక్కటియై | 25 |
| దొల్లెడు సూతులుఁ బెలుచం | 423 |
| దైవాధీనము సర్వమున్ | 453 |
| ద్విరదము లొఱగెడివియు | 225 |
| ద్రోణాచార్యుండు సుతత్రాణ | 369 |
| ద్రోణాచార్యుండు ద్రుపద | 328 |
| ద్రోణుండలిగి శరాసనంబు | 164 |
| ద్రోణుఁడు గోపించి తనుత్రాణం | 377 |

ధ

| పద్యము | పుట |
|---|---|
| ధనంజయుండును దనకు | 314 |
| ధనురాచార్యునిఁ జూచి | 343 |
| ధరణినాథ చేకితానుండు | 124 |
| ధరణి నెత్తుటఁ దోఁగి | 353 |
| ధరణీచక్రము గ్రక్కునం గదల | 388 |
| ధాత్రీశ మేరువు దక్షిణంబున | 11 |
| ధూళుల మేఘంబులు | 352 |
| ధృతరాష్ట్రుండును బుత్త్రులు | 375 |
| ధృతి బలుపొప్ప నిల్చి | 308 |
| ధృష్టకేతుండు కౌరవోత్కృష్టుఁడైన | 121 |
| ధృష్టద్యుమ్నుఁడు నుజ్జ్వల | 224 |

న

| పద్యము | పుట |
|---|---|
| నకులుఁడు సహదేవుఁడు | 221 |
| నగపతియుఁ బోని గజతతి | 347 |
| నడచిరనిన విని సంజయునకు | 193 |
| నడికిరేయి వచ్చినను నొవ్వ | 360 |
| నను మార్కొని గెలువఁగ | 73 |
| నన్నుఁ బాంసుకేళి నున్న | 403 |
| నరనాథ యింక భీష్ముని | 355 |
| నరపతులనెల్ల భీష్మున | 146 |
| నరసఖుఁడ నీవు సఖుఁడును | 245 |
| నరుఁడత్యద్భుత విక్రముం | 448 |
| నరుఁడు దనమీఁదఁ దొరఁగెడు | 435 |
| నరుఁడు శిఖండిం దఱిమిన | 428 |
| నరుఁడేచి శిఖండి | 421 |
| నరుఁడు ధనుర్గుణరావ | 350 |
| నరుఁడు రథికజనంబుపై | 329 |
| నలువురు నేవురు బిడ్డలు | 06 |
| నాఁడు సభనాడి నంతయు | 324 |
| నాఁడె చెప్పఁగన్న నాకు | 191 |
| నాకు దేవవ్రతునకు | 397 |
| నానాస్త్రంబుల హయముల | 311 |
| నానాస్ఫుటవర్ణంబులు | 98 |
| నామములఁ బితృపితామహ | 185 |
| నాయుల్లమరయ నిను | 443 |





| పద్యము | పుట |
|---|---|
| నారదుచేత నిన్ను | 448 |
| నారాయణ నీకేఁ గడు | 244 |
| నిగమ శిఖావిహార మహనీయ | 141 |
| నిజఘటకు మిగిలి యుత్తరు | 135 |
| నిజసింహనాదమున | 223 |
| నిడుపునఁ దూర్పును బడమరనై | 12 |
| నినుఁగొని గెలిచెద | 296 |
| నిను నెఱుఁగకుండి | 104 |
| నిను మున్నెంతయు నమ్మి | 356 |
| నియతియుఁ దపమును | 108 |
| నిరతిశయ మహాత్మ్యోన్మేష | 141 |
| నిలిచి మహాస్త్రంబెఱమంటలు | 339 |
| నిహతులంజేయుచు | 267 |
| నీకు మా దెస ననుగ్రహంబు | 395 |
| నీకు హృదయవ్యథఁ బొంద | 105 |
| నీకొడుకు లందఱును | 222 |
| నీతనూభవుండు నెఱిగుఱి | 274 |
| నీతలంపు లెస్సనీవు | 398 |
| నీదెసఁ గోపింతునె | 451 |
| నీమాట మెయిన చేయుదు | 147 |
| నీయడిగిన భంగిన గాంగేయు | 252 |
| నీయుదయము దైవిక | 451 |
| నీవు తనూజుల దుర్విన | 325 |
| నీవు ద న్నడిగిన నిజవధోపాయం | 398 |
| నీవును ద్రోణుఁడు గలుగంగా | 346 |
| నీవు భీష్మున కలికిన | 414 |
| నీవొకరుండు దక్కఁగ | 406 |
| నెట్టన యాపగాసుతుఁడు | 30 |
| నెవ్వగ యింతయేల విను | 147 |
| నేఁటి భంగిసూడ నృపవర | 412 |
| నేఁడెమ్మెయి నైనను నీ | 411 |
| నొచ్చియుఁ బెనఁగిన | 259 |
| నొచ్చియు భీష్మునిపై | 199 |
| నోనేసి సూతుహయసంతానము | 217 |

ప

| పద్యము | పుట |
|---|---|
| పంద్రెంటఁ బంద్రెంట | 381 |
| పటుదుశ్శాసన బాణపంక్తి | 418 |
| పట్టి పొలార్చెదరు మీరు | 249 |
| పతి పురికొలిపిన | 227 |
| పతియును ద్రోణుండు | 213 |
| పదంపడి నిట్టూర్పునిగిడించి | 358 |
| పదపడి దుర్యోధనుఁడు | 114 |
| పదిటన్ ధృష్టద్యుమ్నుని | 216 |
| పదివేవురు రాజులు దన | 24 |
| పనుచుటయు నతఁడు | 222 |
| పరఁగి తోఁతెంచు పాండవ | 347 |
| పరమ ముని లాదిపురుషులు | 246 |
| పరమేష్ఠి నీవు గడు | 245 |
| పరాక్రమ క్రీడలుసలుపు | 375 |
| పరిధానంబును దేరు | 37 |
| పఱపి రథికులను సూతుల | 159 |
| పలక పఱియలుగాఁ జేసి | 303 |
| పలకయు వాలును గొని | 217 |
| పలు చాయల నొప్పిన | 68 |
| పలుచోటులఁ బలుభంగుల | 213 |
| పవనజుఁడు మూఁడు శరముల | 133 |
| పవనసుతుం గళింగ | 168 |
| పాంచాల బర్బర వత్స | 20 |
| పాండవబలముల యత్యు | 423 |
| పాండవబలములు దలపడి | 430 |
| పాండవ సైన్యముల్ దలఁగ | 200 |
| పాండవసైన్య సంఘపరిపాలన | 149 |
| పాండవుల గెలువ నలవి | 297 |
| పాండవేయ మాత్స్య పాంచాల | 413 |
| పాండవేయులు మాత్స్య | 442 |
| పాండునృపాలనందనులు | 112 |
| పాండుసుతుల శిఖండియు | 28 |
| పాండుసుతులేమి భంగి | 407 |
| పాండ్యపతియును గేకయ | 54 |
| పాడియు సత్యముం గలరు | 242 |
| పాడియు సత్యముం గలుగు | 337 |
| పాయవడఁ జొచ్చు గుంపులు | 130 |
| పారాశర్య ప్రముఖోదార | 293 |
| పార్థతుండు శక్తిఁ బరఁగింప | 164 |
| పిలుచుటయు నతఁడు | 444 |
| పుండరీకంబు లుద్దండ | 152 |
| పుణ్యక్షేత్రోత్తమంబయిన | 03 |
| పురికొనుచుం దెరలుచు | 212 |
| పురుమిత్త్రుని నేడుజ్జ్వల | 261 |
| పురుషుఁడన వేటొకండే | 93 |
| పురుషుఁడు సెడు ననువాఁడును | 93 |
| పురుహూత సహితమగు | 191 |
| పులిఁ బొడగన్న లేళ్ళగమి | 204 |
| పుష్పోదంచిత సౌవీర | 55 |
| వృషతకుల ముఖ్యుఁ డిమ్మెయి | 150 |
| పృషత పౌత్రుండు గద వైవ | 164 |
| పెక్కుంద్రతోడ నిమ్మెయి | 277 |
| పెనంగు నట్టియెడ గాంగే | 186 |
| పెనుగాలిఁ దూలు మొగిళు | 226 |
| పెరిఁగి పాండవాంబుధి | 26 |
| పెఱవార లధికభీతిన్ | 234 |
| పొడువఁగ వ్రేయఁగ నతఁడుం | 331 |

| పద్యము | పుట |
|---|---|
| పాదివికొని శకుని బలము | 187 |
| పాదివి పలువురేయఁ బొడువ | 348 |
| పాలివోని శౌర్యరేఖం | 265 |
| పోక నిలిచిన బలు | 181 |
| ప్రమదం బాననకాంతి | 48 |
| ప్రాంశుఁబయోదనీల | 32 |
| ప్రోవులు గట్టినగుజ్జపు | 252 |
| ఫ | |
| ఫలములయెడ బ్రహ్మార్పణ | 95 |
| ఫల్గునుఁడు భీష్ము ముందటి | 418 |
| బ | |
| బధిరిత దిఙ్ముఖంబగుచు | 53 |
| బలియుఁడగు పార్థపుత్త్రుఁడు | 289 |
| బలు జీవమువోయిన | 389 |
| బవరము సేయుచుండియును | 67 |
| బాలురు వృద్ధులుఁ దక్కఁగ | 63 |
| బీఱువోయి రథ్యంబులు | 386 |
| బెడిదముగ నేయ రథముల | 174 |
| భ | |
| భండనంబునఁ దనయుండు | 295 |
| భగదత్తు నాలోకించి | 346 |
| భగదత్తుని నాకవ్వడి | 427 |
| భగదత్తు నెగిచి కౌరవ | 238 |
| భగదత్తు నేనుఁగడరిన | 307 |
| భల్లం బొకటఁ బితామహు | 199 |
| భసిత పరభాగహేలా | 455 |
| భారతవర్షంబున నుదార | 18 |
| భారతవర్షమునకుఁ గా | 17 |
| భారతవర్షము దొడఁగి | 15 |
| భారమున నులచి త్రెంపక | 96 |

| పద్యము | పుట |
|---|---|
| భీమనందనుఁ డగు శ్రుతసోము | 124 |
| భీమసేనుండు నేఁడు | 222 |
| భీమసేనుతో నిట్లనియె | 342 |
| భీమసేను నపుడు పెక్కు | 277 |
| భీమసేనునిపై మన భీష్ము | 119 |
| భీముఁ డుదగ్రదర్పమున | 206 |
| భీముని తనయుం డత్యుద్దామ | 339 |
| భీమునిదెసఁ గాలింగోద్దామ | 253 |
| భీముని పోరుట గడు | 256 |
| భీముని ముందటిబలము | 167 |
| భీము హరులఁ గూల్చి పేర్చి | 349 |
| భీష్ముండు దుర్యోధనున | 243 |
| భీష్ముఁ డభిమన్యుఁ గడచి | 213 |
| భీష్ముఁ డొడ్డన మేర్చిన | 299 |
| భీష్ము దెసకుం జనుచున్నం | 68 |
| భీష్ము నంపఱ కోర్వక | 136 |
| భీష్ముని గర్వంబుడిపి | 249 |
| భూపోత్తమ విను పాండు | 329 |
| భూమికిఁ గాఁగఁ బ్రాణముల | 09 |
| భూరి తపోవిశేష | 292 |
| భూరి బలఘోరమగు | 187 |
| భూరి రయంబున నద్దెస | 277 |
| భూరి శరాసారంబున | 186 |
| భూరిశ్రవసుఁడ యెక్కటి | 265 |
| భూరిశ్రవుండు దొమ్మిది | 230 |
| భేరీ శంకాదిరవ స్ఫారత | 380 |
| మ | |
| మందరము మహాంభోనిధి | 349 |
| మకరవ్యూహం బనియెడు | 248 |
| మగఁడు లేనిమగువ | 29 |
| మగధ మహేశుఁ డేచి | 224 |

| పద్యము | పుట |
|---|---|
| మణి గణోజ్జ్వలమైన | 243 |
| మదమునఁ గోసలేంద్రు | 118 |
| మదమున శ్రుతాయువొక్కటి | 169 |
| మదము మిగిలి కేతుమంతుఁడు | 168 |
| మద్రేశుఁ డంత నిలువక | 135 |
| మద్రేశున్ వెగడొంద నేసె | 134 |
| మనకుఁ బాండురాజతనయ | 33 |
| మన కుమారులలోని నయ్యెనిల | 326 |
| మన బలంబునందు మంచి | 273 |
| మనమున భీష్ముఁడిట్లని | 434 |
| మనమున విషాదమడరఁగ | 393 |
| మనము పూఁచిపట్టి | 296 |
| మన మెల్లఁ బితామహు | 391 |
| మన మొనఁ గని ధృష్టద్యుమ్నున | 182 |
| మన మోహరములు సెడి | 432 |
| మన యోధప్రకరముశాం | 427 |
| మన యోధులందఱునుశాం | 414 |
| మన వారెవ్వరునోర్వ | 394 |
| మన సేనం గలగంగ | 156 |
| మన సేన పేర్చి పెల్లార్చిన | 236 |
| మనుజేంద్ర వినుము | 129 |
| మన్న్య సముజ్జ్వలుండు | 123 |
| మమ్ము నెమ్మి మైఁ గలయ | 78 |
| మరలుపుఁడు పట్టుఁ డిట | 257 |
| మర్దిత తాప సంకలన | 455 |
| మఱియుఁ బెక్కులు లోక | 104 |
| మఱియు నందు నిందును | 426 |
| మఱుతురె యాడిన మాటలు | 201 |
| మఱియు ననేకదుర్ని మిత్తంబులు | 66 |
| మఱియు నమ్మారుత | 133 |
| మఱియు నొక విల్లుగొను | 303 |
| మలఁగి గజ కంధరము | 170 |







| పద్యము | పుట |
|---|---|
| మలయ మనఁగ శుక్తి | 18 |
| మాకెమ్మెయి సామ్రాజ్యము | 400 |
| మాటలు పెక్కులాడి | 453 |
| మాత్స్య కైకేయాది మను | 425 |
| మానుగ ధర్మక్షేత్రంబైన | 80 |
| మానుషమేటికి దైవాధీనము | 219 |
| మిగిలి పవమానసుతుపై | 234 |
| మీతండ్రి ద్రోణునకుఁ దోడై | 272 |
| మీతండ్రి భవత్సుతులకు | 117 |
| మీతండ్రి సింహనాదస్ఫీత | 323 |
| మీరు నా హితంబు గోరుదురేని | 424 |
| మీ వీటికెల్ల మేటివి | 312 |
| ముందటి పదుండ్రునాన్నపు | 422 |
| మునివరుఁడైన నారదుఁడు | 59 |
| మును పదివేవురఁ జంపుదు | 412 |
| మునుపోటులఁ బడినొచ్చుట | 331 |
| మును మత్స్యనాథు నగరం | 385 |
| మున్నును నేఁ గారణముగ | 394 |
| మెఱసి మండలచారియై | 364 |
| మొగుళులు లేకయు నుఱుములు | 06 |
| మొనల వినోదంబునకుం | 76 |
| మొనలెల్ల విఱుగ మధ్యం | 432 |
| మొనసి మృగేంద్రుఁ | 426 |
| మొనసి శిఖండిని మున్నిడి | 415 |
| మోహతమంబు వాసె | 109 |
| య | |
| యాదవ కేకయ పాంచాలాదులు | 200 |
| యుధిష్ఠిరు మొగంబునం | 420 |
| ర | |
| రంగత్ప్రథన స్తుత్యతురంగ | 262 |
| రక్కసుఁడు విఱిగినం | 368 |

| పద్యము | పుట |
|---|---|
| రక్తనదులలోన రథయాన | 287 |
| రథము మీఁదికిఁ జనుదెంచి | 79 |
| రథములను సామజముల | 374 |
| రథములు దఱచై చెలువగు | 40 |
| రభస క్షోభిత మేదినీ | 51 |
| రవిఁ గొల్చి యుత్తరాయణ | 445 |
| రాజులు మంత్రులు ననియెడు | 29 |
| రెండు బలంబుల వారలు | 64 |
| రెండు వీళ్ళ జనంబులు | 269 |
| రేపకడ రభసమున | 181 |
| ఱ | |
| ఱిచ్చపడి యుభయబల | 114 |
| ఱెక్కలు సించి కంఠమున | 155 |
| ల | |
| లలిత పీతాంబరంబు | 388 |
| లస్తకంబున కొలఁదికి | 177 |
| లోకోత్పత్తి స్థితి విల | 244 |
| వ | |
| వంగాధిపతియు శౌర్యో | 336 |
| వగపును గోపముం గదుర | 266 |
| వగవఁగ నేఁటికిఁ బార్థుఁడు | 395 |
| వగవఁగ నేమియుం దగని | 91 |
| వచ్చి యిట్లనియె | 346 |
| వాయువేగంబులైన | 175 |
| వారలందఱు నొండొరు | 275 |
| వారల శర నిచయము | 213 |
| వారల శర వర్షంబులు | 132 |
| వారికి బాసటయై పాంచాల | 221 |
| వారి ననేల తొల్లియు | 17 |
| వారిరువురుఁ జలమున | 187 |

| పద్యము | పుట |
|---|---|
| వారును ముందటి యార్వురు | 214 |
| వారు మహాబలుల్ హరియు | 452 |
| వారెవ్వరంటేని వినుము | 39 |
| వాహనముఁ దాన నడపుచు | 272 |
| విందానువిందులు గ్రందుగ | 125 |
| విందుని సారథినొక | 306 |
| వికలరథుఁడగు నావృష్ణి | 257 |
| విక్రమ విహారంబునకుం | 223 |
| విచలద్దండధరోపమాశ్రయ | 54 |
| విడిదలకుఁ బోయెనపుడు | 321 |
| విడువక దాపట వలపట | 227 |
| విధికృతం బెవ్వరికి నుడుప | 274 |
| వినికి గలిగి రక్షించుచు | 21 |
| విని గాంగేయుం డడరిన | 173 |
| విని నదియును నెయ్యెడ | 33 |
| విని పాండునందనులు | 193 |
| విని మురాంతకుఁ డితఁడు | 397 |
| వినుఁ డన్యు లెవ్వరును | 34 |
| వినుఁడు శరతల్పగతుఁడనై | 446 |
| వినుత ప్రజ్ఞాబాణంబున | 281 |
| విను మలుక వొడమి | 180 |
| విను మానుష చక్షుర్గతి | 98 |
| వినుము | 371 |
| విరథుండై పాలివోని | 165 |
| విరథుండై యభిమన్యు | 284 |
| విరథుఁడయి మాత్స్యపుత్రుఁడు | 137 |
| విఱిగి భవత్సుత | 285 |
| విఱుగుట నొచ్చుట | 305 |
| విల్లుంగేతువుఁ ద్రుంచి | 431 |
| విల్లును నమ్ములు విడుచుచు | 302 |
| వివిధ సన్నాహయుతముగా | 172 |
| వివిధోద్దామ హయావళి | 51 |

